తండులం తత్ర విన్యస్య తన్మధ్యే కలశం న్యసేత్,
రాజతం వాథవా తామ్రమృణ్మయం వా నిర్మితం.
ద్రవ్యాభావే మార్తికం వా విత్తశాఠ్యం న కారయేత్,
తస్యోపరి న్యసేద్వస్త్రం సదశం నూతనం దృఢం.

తా. ఇట్లు సంకల్పము చేసి మధ్యాహ్నసమయమున తత్కాలక్రియలు గూడ నెరవేర్చుకొని, సాయంకాలమున మరల స్నానముచేసి, నిశాముఖమున అనఁగా రాత్రి ప్రారంభకాలమున ఈ వ్రతము చేయవలెను. పూజాగృహమును గోమయముతో నలికి అయిదురంగులచూర్ణములతో ముగ్గులు పెట్టి క్రొత్తవస్త్ర మొకటిపరిచి, దానిమీఁద బియ్యముపోసి వానిమధ్య కలశము వెండిదిగాని, రాగిదిగాని, ఇత్తడిదిగాని తుదకు మట్టిదిగాని కావచ్చును. లోభిత్వము చూపకుండ తన స్థితిననుసరించి యీకలశమును చేయించి, దానిమీఁద మరల క్రొత్తవస్త్రము నుంచవలెను.

తస్యోపరి న్యసేద్దేవం సత్యనారాయణం ప్రభుం,
కర్షమాత్ర సువర్ణేన తదర్ధార్ధేన వా పునః.
ప్రతిమాం కారయేద్విప్ర సత్యదేవస్య సత్వతేః,
పంచామృతేన సుస్నాతం మంటపోపరి విన్యసేత్.

తా. ఆవస్త్రము మీఁద ప్రతిమారూపుఁడగు సత్యనారాయణస్వామిని ఉంచవలెను. ఆప్రతిమ ఒకకర్షము బంగారముతోగాని, అర్ధకర్షము లేదా పావుకర్షము— తుదకు శక్తిననుసరించి బంగారముతో చేయించి పంచామృతములతో నభిషేకించి మంటపమున ఉంచవలెను.

విఘ్నేశః పద్మజా విష్ణుః మహాదేవశ్చ పార్వతీ,
ఆదిత్యాది గ్రహాస్సర్వే శక్రాద్యష్ట దిగీశ్వరాః.
అత్రాంగ దేవతాః ప్రోక్తా స్తస్మాదగ్రే ప్రపూజయేత్,

తా. ముందు విఘ్నేశ్వరుని, లక్ష్మిని, విష్ణుమూర్తిని, శివుని, పార్వతిని, సూర్యుఁడు మున్నగు నవగ్రహములను ఇంద్రాద్యష్టదిక్పాలకులను అధిదేవతా ప్రత్యధిదేవతలతోఁగూడ పూజింపవలయును.

అగ్రతః కలశే దేవం వరుణం పృథగర్చయేత్,

తా. ముందుగా కలశమున వరుణదేవుని పూజింపవలెను.

గణేశ ప్రభృతీన్పంచ కలశస్యోత్తరే న్యసేత్,
ఉదక్సమాప్త్యా సంస్థాప్య పూజనీయాః ప్రయత్నతః.

తా. గణేశ్వరుఁడు మున్నగు అయిదుగురుని, కలశమున కుత్తరమున మంత్రములతో ఉదక్సమాప్తిగా ప్రతిష్ఠించి పూజింపవలయును.

పూర్వాదిదిక్షు చేంద్రాదీన్పూజయేచ్ఛుద్ధ మానసః,
తతో నారాయణం దేవం కలశే పూజయేత్సుధీః.

తా. తరువాత దిక్పాలకులను ప్రాగాదిదిక్కులయందు ప్రతిష్ఠించి పూజింపవలెను. పిదప సత్యనారాయణమూర్తిని కలశముమీఁద పూజింపవలయును.

చాతుర్వర్ణ్యైః వ్రతం కార్యం స్త్రీభిర్వాపి మునీశ్వర,
పౌరాణికై ర్వైదికైశ్చ మంత్రై ర్బ్రాహ్మణ సత్తమః.
కల్పోక్తవిధినా కుర్యా త్సత్యదేవస్య పూజనం,
పౌరాణికై రేవ మంత్రైః కుర్యాత్పూజాం ద్విజేతరః.

తా. నాలుగువర్ణములవారును పురుషులే కాక స్త్రీలుగూడ యీ వ్రతము చేయవచ్చును. బ్రాహ్మణులు పౌరాణికముగను, వైదికముగను పూజింపవలెను. ద్విజేతరులు పౌరాణికముగనే పూజింపవలయును.

యస్మిన్కస్మిన్దినే మర్త్యో భక్తిశ్రద్ధా సమన్వితః,
సత్యనారాయణం దేవం యజేచ్చైవం నిశాముఖే.

తా. తుదకు ఏదినమందైనను సాయంకాలమున మనుష్యులు భక్తి శ్రద్ధలతో శ్రీ సత్యనారాయణవ్రతము చేయవచ్చును.

బ్రాహ్మణైర్బాంధవైశ్చైవ సహితో ధర్మతత్పరః,
నైవేద్యం భక్తితో దద్యాత్సపాదం భక్ష్య ముత్తమం.
రంభాఫలం ఘృతం క్షీరం గోధూమస్యచ చూర్ణకం,
అభావే శాలిచూర్ణం వా శర్కరాంచ గుడం తథా.
సపాదం సర్వభక్ష్యాణి చైకీకృత్య నివేదయేత్

తా. ఈవ్రతమును చేయువారు బ్రాహ్మణులను, బంధువులను పిలిచి కొని వచ్చి చేయవలెను. అరటిపళ్లు, ఆవునేయి, ఆవుపాలు, గోధుమనూక, అదిలేనిచో బియ్యపునూక, శర్కర, లేకున్న బెల్లము ఇవి సపాదముగా అనఁగా శేరుంబావు— ఇట్లుచేర్చి ప్రసాదము సిద్ధముచేసి స్వామికి నివేదన చేయవలయును.

విప్రేభ్యో దక్షిణాం దద్యాత్కథాం శ్రుత్వాజనైస్సహ,
తతశ్చ బంధుభిస్సార్థం విప్రాన్ సప్రీతి భోజయేత్
ప్రసాదం భక్షయే ద్భక్త్యా నృత్యగీతాదికం చరేత్,
తతశ్చ స్వగృహం గచ్ఛే త్సత్యనారాయణం స్మరన్.
ఏవంకృతే మనుష్యాణాం వాంఛాసిద్ధి ర్భవేద్ధ్రువం,
విశేషతః కలియుగే లఘూపాయో హి భూతలే.

తా. నైవేద్యము జరిగించినతరువాత బ్రాహ్మణులకు దక్షిణ లిచ్చి కథ నాలించి, బంధువులతోడను బ్రాహ్మణులతోడను భుజింపవలెను. శ్రీసత్య నారాయణస్వామికి ప్రీతిగా నృత్యగీతాదికమున్ను జరిగింపవలెను. ఇది కలియుగమున భూలోకమున వాంఛాసిద్ధి కలిగించుటకు చాల సులభమైన మార్గము.

# ద్వితీయోఽధ్యాయః



సూతఉవాచ:—

అథాన్యత్సంప్రవక్ష్యామి కృతం యేన పురా ద్విజ,
కశ్చిత్కాశీపురే రమ్యే ఆసీ ద్విప్రోఽతినిర్ధనః
క్షుత్తృడ్భ్యాం వ్యాకులోభూత్వా నిత్యంబభ్రామభూతలే.

తా. ఓ మహామునులారా! తొల్లి యీవ్రతముచేసిన వానికథచెప్పెద వినుఁడు. కాశీనగరమున నొకబ్రాహ్మణుఁ డుండెడివాఁడు. అతఁ డతి నిర్ధనుఁ డగుటవలన క్షుత్తువలన పీడింపఁబడుచు దేశమంతయుఁ సంచరించుచుం డెను.

దుఃఖితం బ్రాహ్మణం దృష్ట్వా భగవా న్బ్రాహ్మణప్రియః,
వృద్ధ బ్రాహ్మణరూప స్తం పప్రచ్ఛ ద్విజ మాదరాత్
కిమర్థం భ్రమసే విప్ర మహీం నిత్యం సుదుఃఖితః,
తత్సర్వం శ్రోతు మిచ్ఛామి కథ్యతాం ద్విజసత్తమ

తా. శ్రీహరి ఆబ్రాహ్మణుని దుఃఖము నెరింగి వృద్ధబ్రాహ్మణవేషధారియై అతనిని కలిసికొని "ఓ బ్రాహ్మణుఁడా! నీవు వేదవిదుఁడవై యుండియుఁ ఇట్లు దుఃఖించుచు తిరుగుచుంటివేల? ఇదంతయుం చెప్పుము" అని యడిగెను.

బ్రాహ్మణఉవాచ:—

బ్రాహ్మణోతి దరిద్రోఽహం భిక్షార్థం వై భ్రమే మహీం,
ఉపాయం యది జానాసి కృపయా కథయ ప్రభో.

తా. ఓ ప్రభూ! నేను అతిదరిద్రుఁడను. భిక్షకై తిరుగుచున్నాను. ఎంతకష్టపడినను పొట్టపోసికొనుట సాధ్యముకాకున్నది. ఇందుకేమైన నుపాయము చెప్పుము. అని ఆబ్రాహ్మణుఁ డడిగెను.

వృద్ధబ్రాహ్మణఉవాచః—

సత్యనారాయణో విష్ణు ర్వాంఛితార్థ ఫలప్రదః,
తస్య త్వం పూజనం విప్ర కురుష్వ వ్రతముత్తమమ్.
యత్కృత్వా సర్వదుఃఖేభ్యో ముక్తో భవతి మానవః.

తా. ఓ బ్రాహ్మణుఁడా! శ్రీ సత్యనారాయణమూర్తి శ్రీహరియొక్క వేరొకయవతారము. దేవదేవుఁడు కోరినదెల్ల నొసంగును. కావున దేనివలన సర్వదుఃఖములను తొలఁగిపోవునో ఆ సత్యనారాయణవ్రతముచేసి సుఖింపుము.

విధానం చ వ్రతస్యాస్య విప్రాయాభాష్య యత్నతః,
సత్యనారాయణో వృద్ధ స్తత్రైవాంతరధీయత.

ఇట్లు చెప్పి యా వృద్ధబ్రాహ్మణుఁ డా వ్రతమును చేయవలసిన విధానమును చెప్పి అక్కడనే అంతర్హితుఁ డయ్యె.

తద్వ్రతం శ్వః కరిష్యామి యదుక్తం బ్రాహ్మణేన వై,
ఇతి సంచింత్య విప్రోఽసౌ రాత్రౌ నిద్రాం నలబ్ధవాన్.
తతః ప్రాత స్సముత్థాయ సత్యనారాయణవ్రతమ్,
కరిష్య ఇతి సంకల్ప్య భిక్షార్థ మగమద్ద్విజః.

తా. అంతట ఆ బీదబ్రాహ్మణుఁడు "వృద్ధబ్రాహ్మణుఁడు చెప్పిన సత్యనారాయణవ్రతమును రేపు చేసెద"నని సంకల్పించుకొని ఆరాత్రి ఉత్సాహామువలన నిద్దుర రాకపోఁగా ఎట్లో కాలముగడపి ప్రాతఃకాలముననే లేచి కార్యములు నిర్వర్తించుకొని "నేఁడు సత్యనారాయణవ్రతము చేసెదను" అని మరల సంకల్పించుకొని భిక్షాటనము బయలుదేరెను.

ఏతస్మి న్దివసే విప్రః ప్రచురం ద్రవ్యమాప్తవాన్,
తేనైవ బంధుభి స్సార్థం సత్యస్యవ్రత మాచరేత్.

తా. ఆరోజున ఆతనికి చాల ద్రవ్యము లభించినది. దానితో నాతఁడు బంధువులను, బ్రాహ్మణులను పిలిచికొని వచ్చి యథావిధిగా సత్యనారాయణ వ్రతము చేసెను.

సర్వదుఃఖ వినిర్ముక్త స్సర్వసంపత్సమన్వితః.
బభూవ సద్విజశ్రేష్ఠో వ్రతస్యాస్య ప్రభావతః.

తా. ఈ వ్రతముయొక్క ప్రభావమువలన ఆబ్రాహ్మణుఁడు సర్వదుఃఖములును తొలఁగిపోఁగా సంవత్సమగ్రుఁడై చాల సంతోషముపొందెను.

తతః ప్రభృతి కాలం చ మాసిమాసి వ్రతంకృతం,

తా. అదిమొదలు ఆబ్రాహ్మణుఁడు ప్రతిమాసమును ఈవ్రతము చేసెను.

ఏవం నారాయణస్యేదం వ్రతం కృత్వా ద్విజోత్తమ,
సర్వపాప వినిర్ముక్తో దుర్లభం మోక్షమాప్తవాన్.

తా. ఇట్లు ఈ సత్యనారాయణవ్రతమును చేయుటవలన ఆబ్రాహ్మణుఁడు మహైశ్వర్యవంతుఁ డగుటయే గాక సకలపాపములనుండి విముక్తుఁడై అంతమున మోక్షము పొందెను.

వ్రతమే తద్యదా విప్రః పృథివ్యాంసం కరిష్యతి,
తదైవ సర్వదుఃఖం చ మనుజస్య వినశ్యతి.

తా. ఈవ్రతము నేమనుష్యుఁ డెప్పుడుచేయునో అతఁ డప్పుడే సర్వదుఃఖములనుండియు ముక్తుఁ డగును.

సూత ఉవాచ:—

ఏవం నారాయణే నోక్తం నారదాయ మహాత్మనే,
మయా తత్కథితం విప్రాః కమన్య త్కథయామివః.

తా. శ్రీహరి నారదునకుచెప్పిన యీవిషయమును నేను మీకు చెప్పినాను. ఇంకేమి చెప్పుమందురు? అని సూతుఁడు అడిగెను.

ఋషయః ఊచుః:—

తస్మా ద్విప్రా చ్ఛ్రుతం కేన పృథివ్యాం చరితం మునే,
తత్సర్వం శ్రోతుమిచ్ఛామి శ్రద్ధాస్మాకం ప్రజాయతే.

తా. ఓ సూతుఁడా! ఆబ్రాహ్మణునివలన విని యెవఁ డీవ్రతమును చేసెనో అదియంతయు నెఱిఁగింపుమని మును లడిగిరి.

సూత ఉవాచ:—

శృణుధ్వం మునయస్సర్వే వ్రతం కేన కృతం భువి,
ఏకదా సద్విజవరో యథావిభవ విస్తరైః.
బంధుభి స్స్వజనై స్సార్థం వ్రతం కర్తుం సముద్యతః,

తా. ఓ మునులారా! ఈవ్రత మెవనిచే చేయఁబడినదో చెప్పెద వినుఁడు. ఒకప్పు డాబ్రాహ్మణుఁడు తనశక్తి ననుసరించి యీవ్రతము చేయుటకు పూనుకొనెను. బంధువులు స్వజనులు అందరును ఆనందముతో నుండిరి.

ఏతస్మి న్నంతరే కాలే కాష్ఠక్రేతా సమాగతః.
బహిః కాష్ఠాని సంస్థాప్య విప్రస్య గృహమాయయౌ,

తా. అతఁ డట్లు వ్రతము చేయుచుండఁగా పుల్లలమ్ముకొనువాఁ డేగుదెంచి పుల్లలు వీథిలోనుంచి, లోపలకు వచ్చి అంతయు చూచెను.

తృష్ణయా పీడితాత్మా చ దృష్ట్వావిప్రకృతం వ్రతం.
ప్రణిపత్యద్విజం ప్రాహ కిమిదం క్రియతే త్వయా,
కృతే కిం ఫలమాప్నోతి విస్తరాద్వదమే ప్రభో.

తా. పుల్లలమ్ముకొను ఆమనుష్యుఁడు మిగుల దప్పికకలవాఁడయ్యు బ్రాహ్మణుఁడు చేయుచున్నదంతయు చూచి "ఓ మహాత్మా! మీరు చేయుచున్నవ్రత మేమి? ఇది చేసిన ఏమిఫలము వచ్చును? ఇదియంతయు వివరముగా నెఱిఁగింపుము" అని ప్రార్థించెను.

విప్ర ఉవాచ:—

సత్యనారాయణ స్యేదం వ్రతం సర్వేప్సిత ప్రదం,
తస్య ప్రపూజనే సర్వం ధనధాన్యాదికం మహత్.

తా॥ ఓయీ! ఇది సత్యనారాయణవ్రతము. ఇది సకలవాంఛలను నెఱవేర్చును. ధనధాన్యసమృద్ధి కలిగించును.

తస్మా దేతద్వ్రతం జ్ఞాత్వా కాష్ఠ క్రేతాతిహర్షితః,
పపౌ జలం ప్రసాదం చ భుక్త్వా స్వనగరం యయౌ.

తా. ఆబ్రాహ్మణుం డట్లుచెప్పఁగా ఆ కాష్ఠక్రేత చాల నానందించి దాహముపుచ్చుకొని, ప్రసాదము గ్రహించి, భోజనము చేసి తనయింటికి వెడలిపోయెను.

సత్యనారాయణం దేవం మానసేనేత్య చింతయత్,
కాష్ఠ విక్రయతో గ్రామే ప్రాప్యతే చాద్యయద్ధనం.
తే నైవ సత్యదేవస్య కరిష్యే వ్రతముత్తమం,
ఇతి సంచింత్యమనసా కాష్ఠం కృత్వాతుమస్తకే.

తా. ఆకాష్ఠక్రేత ఆవ్రతము చేయదలఁచినవాఁడై మరునాఁడు పుల్లల కావడి యెత్తుకొని "నేఁడు దీనివలన ఎంతధనము వచ్చునో అంతధనమును వెచ్చించి నేను సత్యనారాయణవ్రతము చేసెదను" అని సంకల్పించుకొని పురమునకుఁ బయలుదేరెను.

జగామనగరే రమ్యే ధనినాం యత్రసంస్థితిః,
తద్దినే కాష్ఠమూల్యం చ ద్విగుణం ప్రాప్తవానసౌ.
తతః ప్రసన్నహృదయ స్సుపక్వం కదలీఫలం,
శర్కరా ఘృతదుగ్ధం చ గోధూమస్య చ చూర్ణకం,
కృత్వైకత్ర సపాదం చ గృహీత్వా స్వగృహం యయౌ.

తా. నా డాకాష్ఠక్రేత ధనవంతు లున్నవీథికిఁ బోయి అమ్మగా పూర్వదినములకంటె ఎక్కువ డబ్బువచ్చెను. దానితో నాతఁడు చాల సంతోషించి అరటిపండ్లు, శర్కర, నేయి, పాలు, గోధుమనూక — ఇవి శేరుంబావు కొని యింటికి వెళ్లెను.

తతో బంధూ న్సమాహూయ చకారవిధినా వ్రతం,
తద్వ్రతస్య ప్రభావేన ధనపుత్రాన్వితో భవత్
ఇహలోకే సుఖం భుక్త్వా చాంతే సత్యపురంయయౌ.

తా. తరువాత అతఁడు బంధువుల నాహ్వానించి విధివిధానముగ సత్యనారాయణవ్రతము చేసెను. ఈవ్రతముయొక్క ప్రభావమువలన అతఁడు ధనము, పుత్రపుత్రికలు, సుఖము, ఆనందము పొంది బ్రతికి యున్నంతకాలము నానంద మనుభవించి, అంతమున సత్యపురమున కరిగెను.

---

## తృతీయోఽధ్యాయః.

సూత ఉవాచ:—

శ్లో. పునరగ్రే ప్రవక్ష్యామి శృణుధ్వం మునిసత్తమాః,
పురా చోల్కాముఖోనామ నృపశ్చాసీ న్మహీపతిః.
జితేంద్రియ స్సత్యవాదీ గచ్ఛ న్దేవాలయం ప్రతి,
దినేదినే ధనం దత్వా ద్విజా న్సంతోషయే త్సుధీః.

తా. ఓ మునీశ్వరులారా! మరల మరియొకకథ చెప్పెద నాలింపుఁడు. పూర్వము ఉల్కాముఖుః డనునొకరాజు కలఁడు. అతఁడు జితేంద్రియుఁడు. సత్యవాది. అతఁడు దినదినమును దేవాలయమున కరుగుచు బ్రాహ్మణులకు విశేషధన మిచ్చి సంతోషపరుచుచుండును.

భార్యాతస్య ప్రముగ్ధా చ సరోజవదనా సతీ,

భద్రశీలా నదీతీరే సత్యస్య వ్రతమాచరేత్.

తా. అతనిభార్య చాల అందకత్తె. మరియు మిగుల ఉత్తమురాలు. ఆదంపతులు లోకనాడు భద్రశీలానదీతీరమున సత్యనారాయణవ్రతము గావించిరి.

ఏతస్మిన్నంతరే తత్ర సాధురేక స్సమాగతః,
వాణిజ్యార్థం బహుధనై రనేకైః పరిపూరితాం.
నావం సంస్థాప్యతత్తీరే జగామ నృపతిం ప్రతి,
దృష్ట్వాచ వ్రతినం భూపం పప్రచ్ఛ వినయాన్వితః.

తా. ఆరాజిట్లు వ్రతముచేయుచుండగా సాధువను నొకవైశ్యుడు అనంతధనములతో పడవనింపుకొని వర్తకమునిమిత్తము ఆమార్గమున నెక్కడకో పోవుచు రాజు వ్రతముచేయుచుండుట చూచి, పడవ ఒడ్డునకు చేర్పించి, సమీపమున కరిగి ఇట్లు అడిగెను.

సాధురువాచ:—

కిమిదం కురుషే రాజన్ భక్తియుక్తేన చేతసా,
ప్రకాశం కురు తత్సర్వం శ్రోతుమిచ్ఛామి సాంప్రతమ్.

తా. ఓ రాజేంద్రా! నీవిప్పుడు చేయుచున్న వ్రతమేమో సాంగముగా, విధివిధానసహితముగా నాకెఱిగింపుము. ఇదియంతయు వినవలతును.

రాజా ఉవాచ:—

పూజనం క్రియతే సాధో విష్ణో రతులతేజసః,
వ్రతం చ స్వజనైస్సార్థం పుత్రాద్యావాప్తి కామ్యయా.

తా. వర్తకుడిట్లడుగగా రాజు "ఓయీ! పుత్రులు లభించుటకై మేము శ్రీసత్యనారాయణవ్రతము చేయుచున్నాము" అని విధానము గూడ చెప్పెను.

భూపస్య వచనం శ్రుత్వా సాధుః ప్రోవాచసాదరం,
మమాపి సన్తతిర్నాస్తి హ్యేతస్మా జ్జాయతేధ్రువం

తా. వర్తకుఁడు రాజు చెప్పినది విని "ఓ రాజేంద్రా! నాకును సంతతి లేదు; గావున నేనును ఈవ్రతముచేసి సంతానసౌఖ్యము నందెదను" అని పలికెను.

తతో నివృత్యవాణిజ్యా త్సానందో గృహమాయయౌ,
భార్యాయైకథితం సర్వం వ్రతం సన్తతిదాయకం.
తదా వ్రతకరిష్యామి యదా మే సన్తతి ర్భవేత్,
ఇతి లీలావతీం ప్రాహ పత్నీం సాధు స్సు సత్తమః.

తా. అంతట ఆవర్తకుఁడు వర్తకము పూర్తిచేసికొని, మరలి స్వనగరము చేరి, వ్రతముసంగతి లీలావతి యను తనభార్య కెఱిఁగించి ఆమె వినుచుండ "నాకు సంతానము కలిగినవెంటనే యీవ్రతము చేసెద"నని ప్రతిజ్ఞ చేసెను.

ఏకస్మి న్దివసే తస్యభార్యా లీలావతీ సతీ,
భర్తృయుక్తానందచిత్తా భవద్ధర్మపరాయణా.
గర్భిణీసా భవత్తస్య భార్యా సత్యప్రసాదతః,
దశమే మాసివై తస్యాః కన్యారత్నమజాయత.

తా. ఒకానొకదినమున లీలావతి ధర్మపరాయణ యగుచు భర్తతో సుఖించి, గర్భవతియై నవమాసములు మోసి పదవమాసమున ఒకకొమార్తను కనెను.

దినేదినే సా వవృధే శుక్లపక్షే యథాశశీ,
నామ్నా కళావతీ చేతి తన్నామకరణం కృతం.

తా. ఆదంపతు లాబాలికకు కళావతియని పేరుపెట్టిరి. ఆమె శుక్లపక్షచంద్రరేఖవలె దినదినప్రవర్ధమాన యగుచుండెను.

తతో లీలావతీ ప్రాహ స్వామినం మధురం వచః,
న కరోషి కిమర్థం వై పురా సంకల్పితం వ్రతం.

తా. అప్పుడు లీలావతి భర్తను చూచి "మనకు సంతానము కలిగి నచో సత్యనారాయణవ్రతము చేసెద" నని ప్రతిజ్ఞ తాల్చితివి. మనకు ఆఫలము లభించినది. ఇంకను వ్రతమేలచేయవు?" అని మృదుమధురముగ నడిగెను.

వివాహసమయే తస్యాః కరిష్యామి వ్రతంప్రియే,
ఇతిభార్యాం సమాశ్వాస్య జగామ నగరం ప్రతి.

తా. అందు కాతఁడు "ప్రియా! అమ్మాయి వివాహకాలమున వ్రతము చేసెద" నని ఆమె నూరడించి వాణిజ్యమునకై పట్టణమునకు వెడలెను.

తతః కలావతీ కన్యా వవృధే పితృవేశ్మని,
దృష్ట్వా కన్యాం తతస్సాధుః నగరే సఖిభిస్సహ,
మంత్రయిత్వా ద్రుతందూతం ప్రేషయామాస ధర్మవిత్.
వివాహార్థంచకన్యాయాః వరం శ్రేష్ఠం విచారయ.

తా. పిదప కళావతి పెరుగుచుండఁగా సాధువు చూచి ఒకదూతను పిలిచి "నీవు త్వరగాపోయి అమ్మాయికి తగినవరుని వెదకికొని రమ్ము. అని పంపెను.

తేనాజ్ఞప్తశ్చ దూతోసౌ కాంచనం నగరం యయౌ,
తస్మాదేకం వణిక్పుత్రం సమాదాయ గతోహి సః.
దృష్ట్వాతం సుందరం బాలం వణిక్పుత్రం గుణాన్వితం,
దత్తస్సాధుః కుమారీంతాం కన్యాం విధివిధానతః.

తా. సాధువు ఆజ్ఞాపింపఁగా ఆదూత కాంచననగరమునకరిగి యోగ్యుఁడగు నొక వణిక్పుత్రుని నిశ్చయించుకొని తీసికొని వచ్చెను. సాధువు అన్నివిధములను అర్హుఁడైయున్న సుందరుఁడగు ఆ వణిక్పుత్రునకు కలావతి నిచ్చి దేవేంద్రవైభవముతో వివాహము కావించెను.

తతోఽభాగ్యవశాత్తేన విస్మృతం వ్రతముత్తమం,
వివాహసమయే తస్యాస్తేన రుష్టోఽభవత్ప్రభుః.

తా. ఈ యానందకోలాహలమున అభాగ్యవశమున సాధువు వ్రతముమాట మఱచిపోయెను. అందుకు శ్రీసత్యనారాయణస్వామి చాల కోపించెను.

తతః కాలేన నియతో నిజకర్మ విశారదః,
వాణిజ్యార్థం గతశ్శీఘ్రం జామాతృ సహితో వణిక్.
రత్నసానుపురే రమ్యే స్థిత్వా సింధుసమీపతః,
వాణిజ్య మకరోత్సాధు ర్జామాత్రా శ్రీమతా సహ.

తా. అంతట వాణిజ్యనిపుణుఁడగు ఆసాధువు కొంతకాలమునకు అల్లునితోఁగూడ వర్తకమునిమిత్తము బయలుదేరి సముద్రతీరమున గల రత్నసానుపురమున వర్తకము జేసెను.

తౌ గతౌ నగరం రమ్యం చంద్రకేతో ర్నృపస్య చ,
ఏతస్మిన్నంతరే కాలే సత్యనారాయణః ప్రభుః.
భ్రష్ట ప్రతిజ్ఞమాలోక్య శాపం తస్మై ప్రదత్తవాన్.

తా. వా రిరువురును పిదప చంద్రకేతుమహారాజు నగరమున కరిగిరి. సాధువు భ్రష్టప్రతిజ్ఞుఁ డగుట చూచి శ్రీసత్యనారాయణస్వామి కోపించి అతనిని శపించెను.

దారుణం కఠినం చాస్య మహ ద్దుఃఖం భవిష్యతి,
ఏతస్మి న్దివసే రాజ్ఞో ధన మాదాయతస్కరః,
తత్రైవ చాగత శ్చౌర్యా ద్వణిజౌయత్ర సంస్థితౌ.

తా. వీనికి "దారుణమును కఠినము నగుదుఃఖము కలుగుగాక" అని శపించెను. నాఁడురాత్రి దొంగలు రాజుగారి బొక్కసమునపడి కొంతధనము దోఁచుకొని ఈవర్తకులున్న చోటికి వచ్చిరి.

తత్పశ్చా ద్ధావ కా స్తూతాః దృష్ట్వా భీతేనచేతసా,
ధనం సంస్థాప్య తత్రైవ సతుశీఘ్ర మలక్షితః.

తా. రాజభటులు ఈసంగతి యెఱింగి వెంట పరువెత్తుకొనిరాగా దొంగ ఆధన మావర్తకులచెంత పడవైచి మాయమై పోయెను.

తతో దూతా స్సమాయాతాః యత్రాస్తే సజ్జనోవణిక్,
దృష్ట్వా నృపధనం తత్ర బధ్వానీతౌ వణిక్సుతౌ

తా. అంతట రాజభటులు వచ్చి ధనమక్కడ నుండుటవలన ఆవర్తకులే దొంగలని తలఁచి వారినికట్టి రాజసభకు కొనిపోయిరి.

హర్షేణ ధావమానాశ్చ ఊచు ర్నృపసమీపతః,
తస్కరౌ ద్వౌ సమానీతౌ విలోక్యాజ్ఞాపయప్రభో.
రాజ్ఞాజ్ఞప్తా స్తత శ్శీఘ్రం దృఢం బద్ధ్వాతు తావుభౌ,
స్థాపితౌ చ మహాదుర్గే కారాగారే విచారతః.

తా. దూతలు రాజును జూచి "ప్రభూ! ధనముతోగూడ చోరులను కొనివచ్చితిమి. విచారణ గావించి తగునట్లు శిక్షింపుము" అని విన్నవింపఁగా రాజు విచారణచేయకయే "వీరిని కారాగారమున బంధింపుఁడు" అని చెప్పెను. భటు లట్లేచేసిరి.

మాయయా సత్యదేవస్య నశ్రుతం కై స్తయోర్వచః,
తత స్తయో ర్ధనం రాజ్ఞా గృహీతం చంద్రకేతునా.
తచ్ఛాపాచ్చ తయోర్గేహే భార్యా చైవాతిదుఃఖితా,
చోరేణాపహృతం సర్వం గృహే యచ్చస్థితం ధనం.

తా. శ్రీ సత్యనారాయణస్వామియొక్క మాయవలన వారెన్ని విధముల ప్రార్థించినను వారిమాట లెవరికిని వినిపింపవయ్యె. పైఁగా ఆచంద్రకేతుమహారాజు వారిధనమంతయు తనబొక్కసమున చేర్పించుకొనెను. ఆ శాపమువలననే సాధువుయొక్క భార్యయును, కొమార్తెయును దుఃఖములకు

పాల్పడిరి. ఇంటనున్న సకలవిధద్రవ్యమును చోరు లపహరించుకొనిపోయిరి.

ఆధివ్యాధి సమాయుక్తా క్షుత్పిపాసాతి దుఃఖితా,
అన్నచింతాపరాభూత్వా బభ్రామ చ గృహేగృహే.

తా. లీలావతికి రోగములు వచ్చెను. మనోవ్యధలు పెరిగిపోయెను. పైఁగా తినుటకు తిండియైన లేకపోవుటవలన ఇంటింకేని తిరిగి బిచ్చమెత్తుకొనసాగెను.

కలావతీతి కన్యాపి బభ్రామ ప్రతివాసరం,
ఏకస్మిన్దివసేయాతా క్షుధార్తా ద్విజమందిరం.

తా. కలావతియు ఇట్లే అన్నమునిమిత్తము తిరుగసాగెను. ఆమె యొకనాఁడు ఆకొని ఒకబ్రాహ్మణుని యింటికి వెళ్లెను.

గత్వాపశ్య ద్వ్రతంతత్ర సత్యనారాయణస్య చ,
ఉపవిశ్య కథాం శృత్వా పరం ప్రార్థితవత్యపి.

తా. అక్కడ సత్యనారాయణవ్రతము జరుగుచుండ కలావతి పూర్తియగునంతవరకు నుండిచూచి, కథ విని స్వామిని ప్రార్థించెను.

ప్రసాద భక్షణం కృత్వా యయౌరాత్రం గృహంప్రతి,
మాతా కలావతీం కన్యాం కథయామాస ప్రేమతః.

తా. ఆమె ప్రసాదమునుగూడ స్వీకరించి రాత్రికి యింటికివెళ్లఁగా తల్లి ప్రేమతో చేరఁబిలిచి యిట్లడిగెను.

పుత్రీ రాత్రౌ స్థితా కుత్ర కింతే మనసివర్తతే,
కన్యా కలావతీ ప్రాహమాతరం ప్రతిసత్వరం.
ద్విజాలయే వ్రతంమాతః దృష్టం వాంఛితసిద్ధిదం,
తచ్ఛృత్వా కన్యకావాక్యం వ్రతంకర్తుం సముద్యతా.

తా. అమ్మాయీ! రాత్రియగువరకు నీ వెక్కడ నుంటివి? నీమనస్సున నేమి కోరికయున్నది?" అని తల్లియడుగ కలావతి వెంటనే "అమ్మా! బ్రాహ్మణగృహమున సత్యనారాయణ వ్రతము జరుగుచుండఁగాచూచి, విని, ప్రసాదముఁ గైకొనివచ్చితి" నని చెప్పెను. లీలావతి అది విని వ్రతము చేయవలయునని సంకల్పించుకొనియెను.

సాముదాతు వణిగ్భార్యా సత్యనారాయణస్య వై,
వ్రతం చక్రే తదా సాధ్వీ బంధుభి స్సజనై స్సహ.
భర్తృజామాతరౌ క్షిప్ర మాగచ్ఛేతాం స్వమాశ్రమం,
అపరాధం చ మే భర్తు ర్జామాతుః క్షంతు మర్హసి.

తా. వణిక్పత్ని యగు లీలావతి బంధువులతోడను, స్వజనులతోడను కూడుకొన్నదై భక్తితో సత్యనారాయణ వ్రతము చేసి "ప్రభూ! మాఅందరి అపరాధములను క్షమించి నాభర్తయు, నాఅల్లుఁడును సుఖముతోడను సంతోషముతోడను శీఘ్రముగా ఇంటికివచ్చునట్లు చేయుము" అని ప్రార్థించెను.

వ్రతేనానేన సంతుష్టో సత్యనారాయణ ప్రభుః,
దర్శయామాస స్వప్నం హి చంద్రకేతో ర్నృపస్య చ.
బంధితౌ మోచయప్రాత ర్వణిజౌ నృపసత్తమ,
దేయం ధనం చ తత్సర్వం గృహీతం యత్వయాధునా.
నోచే త్త్వాం నాశయిష్యామి సరాజ్య ధనపుత్రకం,
ఏవమా భాష్యరాజానం ధ్యానగమ్యో భవత్ప్రభుః.

తా. లీలావతి చేసిన యీవ్రతమువలన స్వామి సంతుష్టుఁడై ఆ రాత్రియందే స్వప్నమున సాక్షాత్కరించి "నీ విదివరలో కారాగృహమున బంధించియున్న వర్తకులనిద్దరను ప్రాతఃకాలమునందే విడిచిపెట్టుము. వారి ధనముగూడ అంతయు నిచ్చివేయుము. అట్లు చేయవేని రాజ్యముతోడను,

పుత్త్రులతోడను, సకలైశ్వర్యములతోడను నిన్ను నాశనము చేసెద''నని చెప్పి అంతర్హితుఁ డయ్యెను.

తతః ప్రభాతసమయే రాజా చ స్వజనైః స్సహ,
ఉపవిశ్య సభామధ్యే ప్రాహ స్వప్నంజనం ప్రతి.
బద్ధౌ మహాజనౌ శీఘ్రం మోచయధ్వం వణిక్సుతౌ,
ఇతి రాజ్ఞో వచశ్శ్రుత్వా మోచయిత్వా మహాజనౌ.
సమానీయ నృపస్యాగ్రే ప్రాహుస్తే వినయాన్వితాః,
ఆనీతౌ ద్వౌ వణిక్పుత్త్రౌ ముక్తౌ నిగళబంధనాత్.

తా. అంతట ప్రభాతముకాఁగానే రాజు సభకువచ్చి రాత్రివచ్చిన కలఅంతయు సభాసదులకు విప్పిచెప్పి ''ఆవర్తకులను వెంటనే విడిచిపెట్టుఁడు. అని భటుల కాజ్ఞాపించెను. అంత నాభటులును వారిని బైటికితెచ్చి రాజ సభకుఁ గొనిపోయి ''వీరే ఆవణిక్పుత్త్రులు. ఆనితీయవలయు'' నని రాజునకు విన్నవించిరి.

తతో మహాజనౌనత్వా చంద్రకేతుం నృపోత్తమం,
స్మరంతౌ పూర్వవృత్తాంతం నోచతుర్భయ విహ్వలాః.

తా. పిదప మహాజనులగు ఆవర్తకులు రాజునకు నమస్కరించిరి; గాని పూర్వవృత్తాంతము స్మరించుకొనుచు భయవిహ్వలులై ఏమియుఁ పలుకకుండ నూరకుండిరి.

రాజా వణిక్సుతౌ వీక్ష్య వచఃప్రోవాచ సాదరం,
దైవాత్ప్రాప్తంమహద్దుఃఖ మిదానీంనాస్తి వై భయం.
తదా నిగళసంత్యాగం క్షౌరకర్మాద్యకారయత్,
వస్త్రాద్యలంకృతిం దత్వా పరితోష్య నృపశ్చతౌ.

తా. అప్పుడు రాజు వారిని చూచి ''దైవ ప్రాతికూల్యమువలన మీకు మహాదుఃఖము తటస్థించినది. అయితే మీకిక భయములేదు'' ఇట్లు

చెప్పి రాజు వారికి సంకెలలు తీయించి క్షురకర్మాదికము నెరవేర్పించి విలువ గలవస్త్రములు అలంకారములు నిచ్చి సంతోషపరిచెను.

పురస్కృత్య వణిక్పుత్రౌ వచసాతోషయ ద్భృశం,
పురానీతంతు యద్ద్రవ్యం ద్విగుణీకృత్య దత్తవాన్.

తా. మరియు రాజు వారిని చాల గౌరవించి కొనియాడి తాను స్వాధీనము చేసికొనినదానికి రెట్టింపుధనమిచ్చి ఆనందపరిచెను.

ప్రోవాచతౌ తతోరాజా గచ్ఛసాధో నిజాశ్రమం,
రాజానం ప్రణిపత్యాహ గంతవ్యం త్వత్ప్రసాదతః.

తా. మరియు చంద్రకేతుమహారాజు వారిని ఆదరముతో "ఇంక సుఖముగా మీయింటికి దయచేయుఁడు" అని పలికెను. వర్తకులును రాజును నమస్కారములుచేసి కొనియాడి వెడలిపోయిరి.

---

## చతుర్థోఽధ్యాయః.

సూత ఉవాచ:—

యాత్రాం కృత్వా తతస్సాధు ర్మంగళాచారపూర్వకం,
బ్రాహ్మణేభ్యో ధనందత్వా యయౌ స్వనగరం ప్రతి.

తా. తరువాత సాధువు తీర్థయాత్రలుచేసి బ్రాహ్మణులకు ధనమిచ్చి స్వనగరమునకు బయలువెడలెను.

కియ ద్దూరంగతే చాబ్ధౌ సత్యనారాయణ ప్రభుః,
జిజ్ఞాసాం కృతవాన్ సాధో నౌకాయా మస్తికిం తవ.

తా. వారు సముద్రమున కొంతదూరము పోయినతరువాత శ్రీసత్య నారాయణస్వామి సన్న్యాసిరూపముతో వచ్చి "ఓ వర్తకుఁడా! పడవయం దున్న సామానువేమి? అని యడిగెను.

తతో మహాజనౌమత్తా హేలయాచ ప్రహస్యవై,
కథం పృచ్ఛసి భోదండిన్ ముద్రాంనేతుం కిమిచ్ఛసి.
లతా పత్రాదికం చైవ వర్తతే తరణౌమమ,
ఇత్యుక్తం వచనం శ్రుత్వా సత్యం భవతు తే వచః.

తా. అది విని ఆవర్తకులు మదించియున్నారు గావున వేళాకోళముగ నవ్వుచు "ఓ సన్న్యాసీ! పడవలో నేమున్నదో నీకెందుకు? మా ధనముహరించుటకు ఆలోచించుచున్నావా యేమి? ఇందు ఆకు నలము తప్ప మరేమియు లేదు" అని చెప్పిరి. ఆ సన్న్యాసి యిది విని అట్లే యగుగాక" అని చెప్పెను.

ఏవముక్త్వా గతశ్శీఘ్రం దండీతస్య సమీపతః,
కియద్దూరం తతోగత్వా స్థిత స్సింధుసమీపతః.
గతే దండిని సాధుశ్చ కృతనిత్య క్రియస్తదా,
ఉత్థితాం తరణిం దృష్ట్వా విస్మయం పరమం యయౌ.

తా. ఇట్లుచెప్పి సన్న్యాసి అక్కడినుండి వెడలిపోయి కొంచెము దూరమున నిలిచెను. తరువాత సాధువు నిత్యకృత్యములను జేసికొని పడవ తేలిపోయియుండుట చూచి తెల్లబోయెను.

దృష్ట్వాలతాదికం చైవ మూర్ఛితో న్యపతద్భువి,
లబ్ధసంజ్ఞో వణిక్పుత్ర స్తతశ్శోకాన్వితో భవత్.

తా. మరియు నతఁడు తనపడవలో రూపాయలసంచులకుబదులు ఆకు నలమే యుండుటచూచి మూర్ఛిల్లి కొంతసేపటికి లబ్ధసంజ్ఞుఁడై దారుణముగ విలపింపసాగెను.

తదాతు దుహితుః కాంతో వచనం చేదమబ్రవీత్,
కిమర్థం క్రియతే శోక శ్శాపోద త్తశ్చ దండినా.
శక్యతే తేన సర్వం హి కర్తుం చాత్ర న సంశయః,
అతస్తం శరణం యామో వాంఛితార్థోఽభవిష్యతి.

నికటే నగరస్యైవ జామాత్రా సహితో వణిక్,
ఆగతో బంధువర్గైశ్చ స్వజనై ర్బహుభిర్యుతః.

తా. ఆదూత నగరమునకరిగి లీలావతిని చూచి మ్రొక్కి "అమ్మా! యజమానులు అల్లుఁడుగారితోడను, స్వజనులతోడను వచ్చినారు. పడవ యిప్పుడే రేవుచేరినది" అని చెప్పెను.

శ్రుత్వా దూతముఖాద్వాక్యం మహాహర్షవతీ సతీ,
సత్యపూజాం తతః కృత్వా ప్రోవాచ తనుజాం ప్రతి.
వ్రజామి శీఘ్రమాగచ్ఛ సాధుసందర్శనాయ చ,
ఇతి మాతృవచశ్శ్రుత్వా వ్రతం కృత్వా సమాప్య చ.
ప్రసాదంతు పరిత్యజ్య గతా సాపి పతింప్రతి,

తా. లీలావతి దూతమాట విని చాలా సంతోషించి "సత్యనారాయణవ్రతము ముగించి రమ్ము. త్వరగాపోదము" అని కొమార్తెను తొందరపెట్టి బయలుదేరెను. వారిరువురునుగూడ పూజపూర్తిగనే చేసిరి; గాని యీతొందరలో ప్రసాదముపుచ్చుకొనుట మరిచిపోయిరి.

తే నరుష్ట స్సత్యదేవో భర్తారం తరణీం తదా.
సంహృత్య చ ధనై స్సార్థం జలే తస్మి న్నమజ్జయత్,
దృష్ట్వా తథావిధాం నావం కన్యాం చ బహుదుఃఖితాం.
భీతేన మనసా దుఃఖమాపురాశ్చర్య మంతికాః,

తా. అందువలన సత్యనారాయణస్వామి ధనముతోడ అల్లుని పడవను ముంచివేసెను. తీరమం దున్నవారందరు నది చూచి దుఃఖమును ఆశ్చర్యమునుగూడ పొందిరి.

చింతయానాశ్చ తే సర్వే బభూవు స్త్రీరవాసకాః.
తతో లీలావతీకన్యాం దృష్ట్వా సా విహ్వలాభవత్,
విలలాపాతి దుఃఖేన భర్తారం చేదమబ్రవీత్.
ఇదానీం నౌకయా సార్థం కథం సోఽభూదలక్షితః,
నజానే కస్య దేవస్య హేలయా నౌశ్చసాహృతా.
సత్యదేవస్య మాహాత్మ్యం జ్ఞాతుం కర్తుం న శక్యతే,
ఇత్యుక్త్వా విలలాపైవ తతశ్చ స్వజనైః సహ.
తతో లీలావతీ కన్యాం క్రోడే కృత్వా రురోదహ,

తా. వారందరు నట్లు దుఃఖించుచుండ లీలావతిని కొమార్తను చూచి విహ్వలయగుచు ''అల్లుండా! చూచుచుండఁగనే నౌకతో మునిగిపోతివి గదా? ఇదంతయుం సత్యనారాయణస్వామి మాహాత్మ్యము'' అని తలంచుకొనుచు కొమార్తను కౌగిలించుకొని దుఃఖింపసాగెను.

తతః కలావతీ కన్యా నష్టేస్వామిని దుఃఖితా.
గృహీత్వా పాదుకాంతస్య హ్యనుగంతుం మనోదధా,
కన్యాయా శ్చరితం దృష్ట్వా సభార్య స్స్వజనోవణిక్.
అతిశోకేన సంతప్త శ్చింతయామాస ధర్మవిత్,
హృతావా సత్యదేవేన భ్రాంతోహం సత్యమాయయా.
సత్యపూజాం కరిష్యామి యథావిభవ విస్తరం,
ఇతిసర్వా న్సమాహూయ కథయిత్వా మనోగతం.
నత్వా చ దండవద్భూమౌ సత్యదేవం పునఃపునః,

తా. అంతట కలావతిభర్త మృతినొందెనని తలఁచి అతని పాదుకలను గైకొని వానితో సహగమనము చేయుటకు సిద్ధపడెను. సాధువు అది చూచి

మిగుల విచారించుచు "ఇదియంతయును సత్యనారాయణస్వామి మాయతక్క వేరుకాదు. కావున నా వైభవమునుసరించి ఇంక వెంటనే స్వామిని కొలిచెదను" అని నిశ్చయించుకొని అందరను చేరబిలిచి తనయుద్దేశము నెరిగించి స్వామిని సాష్టాంగపడి వేడుకొనెను.

తతస్తుష్ట స్సత్యదేవో దీనానాం పరిపాలకః.
జగాద వచనం చైవం కృపయా భక్తవత్సలః,
త్యక్త్వా ప్రసాదం తే కన్యా పతిం ద్రష్టుం సమాగతా
అతో దృష్టోఽభవత్తస్యాః కన్యకాయాః పతిర్ధ్రువం,
గృహంగత్వా తత్ప్రసాదం భుక్త్వా సాయాతిచేత్పునః.
లబ్ధ భర్త్రీసుతా సాధో భవిష్యతి న సంశయః,

తా. స్వామి అంతట సంతుష్టుడై "ఓసాధూ! నీకూతురు నాప్రసాదమును భుజింపకుండ భర్తనుచూచుటకు వచ్చినది. ఆకారణమువలన నీఅల్లుండామెకును మీకును కన్పింపకుండెను. ఆమె యింటికరిగి ప్రసాదము పుచ్చుకొని మరల వచ్చెనేని అంతయును శుభమగును. ఆమె భర్తనుపొంది సుఖించును. మీరందరు నానందింతురు" అని చెప్పెను.

కన్యకాతాదృశం వాక్యం శ్రుత్వా గగనమండలాత్.
క్షిప్రంతదా గృహంగత్వా ప్రసాద మనుభుజ్య చ,
తతః కలావతీకన్యా జగాద పితరం ప్రతి.
ఇదానీం స్వగృహం యాహి విళంబం కురుషే కథం,
తచ్ఛ్రుత్వా కన్యకావాక్యం సంతుష్టోభూద్వణిక్సుతః.
పూజనం సత్యదేవస్య కృత్వా విధివిధానతః,
ధనై ర్బంధుగణై స్సార్థం జగామ నిజమందిరం.

తా. ఆకాశమునుండి వచ్చిన వాక్యము విని కలావతి వెంటనే యింటికరిగి ప్రసాదము స్వీకరించి వచ్చెను. ఆమె వచ్చునప్పటికి భర్త నావతో

గూడ తేలియుండును. ఆభార్యాభర్తలు, బంధువులు అందరు నానందించిరి. అప్పుడు కలావతి తండ్రినిఁజూచి "నాయనా! ఆలస్యమేలచేసెదవు? ఇంటికి నడువుము" అని చెప్పెను. అదివిని సాధువు బంధువులందరు నానందించుచుండ అక్కడనే వ్రతముచేసి ధనములతోడను, బంధుగణములతోడను నిజమందిరమున కరిగెను.

పౌర్ణమాస్యాం చ సంక్రాంతౌ కృతవాన్సత్యపూజనం,
ఇహలోకే సుఖం భుక్త్వా చాంతే సత్యపురం యయౌ.

తా. పిదప సాధువు బ్రతికియున్నంతకాలము పౌర్ణమినాడును, రవిసంక్రమణమునాడును తప్పకుండ శ్రీసత్యనారాయణవ్రతము చేయుచు బ్రతికియున్నంతకాలము సకలసుఖములు ననుభవించి అంతమున సత్యపురమున కరిగెను.

---

## పంచమోఽధ్యాయః.

సూత ఉవాచ:—

అథాన్యత్సంప్రవక్ష్యామి శృణుధ్వం మునిసత్తమాః,
ఆసీత్తుంగధ్వజో రాజా ప్రజాపాలనతత్పరః.

తా. సూతుఁడు మరల నిట్లు చెప్పెను. మునీంద్రులారా! ఇఁక నొకకథ చెప్పెద నాలకింపుఁడు. తొల్లి తుంగధ్వజుఁడు అనురాజు ప్రజలను కన్నతండ్రివోలె పరిపాలించుచుండెను.

ఏకదా స వనం గత్వా హత్వాబహువిధాన్పశూన్,
ఆగత్య బిల్వమూలం చ దృష్ట్వా సత్యస్య పూజనం.

గోపాః కుర్వంతి సంతుష్టా భక్తియుక్తా స్సబాంధవాః,
రాజా దృష్ట్వాపి దర్పేణ నగత్వాతం ననామసః.

తా. అతఁడొకనాఁడు అరణ్యమున కరిగి అనేకజంతువులను సంహరించివచ్చుచు ఒక మారేడుచెట్టుక్రింద గొల్లలు సబాంధవులై శ్రీ సత్యనారాయణవ్రతము చేయుచుండుట చూచియు రాజగర్వమువలన అటు వెళ్లక, చూడక, నమస్కారమైన చేయక వెడలిపోయెను.

తతో గోపగణా స్సర్వే ప్రసాదం నృపసన్నిధౌ,
సంస్థాప్య పునరాగత్య భుక్త్వా సర్వే యథేప్సితం.

తా. తరువాత గొల్లలు ప్రసాదము తెచ్చి రాజుముంగటనుంచి, మరల పూజాస్థలము చేరి అందరును భక్తితో భుజించిరి.

తతః ప్రసాదం సంత్యజ్య రాజా దుఃఖమవాప సః,
తస్య పుత్రశతం నష్టం ధనధాన్యాదికం చ యత్.

తా. రాజు ఆప్రసాదమును పుచ్చుకొనక నిజనగరమునకు వెడలిపోయెను; గాని స్వామి ఆగ్రహముపొందుటవలన అతనికుమారులు నూర్గురును నశించిరి. ఉన్న ధనదాన్యాదికమంతయు పోయెను. కేవలము దరిద్రము సంభవించుటయే గాక అనేకకష్టములును వచ్చెను.

సత్యదేవేన తత్సర్వం నాశితంమమ నిశ్చితం,
అత స్తత్రైవగచ్ఛామి యత్ర దేవస్య పూజనం.
మనసేతి వినిశ్చిత్య యయౌ గోపాలసన్నిధిం,
తతోసౌ సత్యదేవస్య పూజాం గోపగణైస్సహ
భక్తిశ్రద్ధాన్వితోభూత్వా చకార విధినానృపః,
సత్యదేవ ప్రసాదేన ధనపుత్రాన్వితోఽభవత్.
ఇహలోకే సుఖం భుక్త్వా చాంతే సత్యపురం యయౌ,

తా. అంతట రాజు "రాజ్యగర్వమున గొల్ల లిచ్చినారని నీచపరిచి స్వామిప్రసాదమును భక్షించనైతిని. స్వామి కోపించి నా సంసారమంతయును నష్టపెట్టగలిగెను. జరిగినదంతయును నిజే. సందేహము లేదు." అని నిశ్చయించుకొని మరల ఆగొల్లలచెంతకే అరిగి విధివిధానముగ శ్రీ సత్యనారాయణవ్రతముచేసి వెంటనే ధనవంతుఁడును, పుత్రవంతుఁడునై బ్రతికియున్నంతకాలము సుఖములుపొంది అంతమున సత్యపురమున కరిగెను.

య ఇదం కురుతే సత్యవ్రతం పరమదుర్లభం.
శృణోతి చ కథాం పుణ్యాం భక్తియుక్తః ఫలప్రదాం,
ధనధాన్యాదికం తస్య భవేత్సత్య ప్రసాదతః.
దరిద్రో లభతే విత్తం బద్ధో ముచ్యేత బంధనాత్,
భీతో భయా త్ప్రముచ్యేత సత్యమేవ న సంశయః.

పరమదుర్లభమగు నీవ్రత మెవఁడు చేయునో, యెవఁడు కథ వినునో వాఁడు ధనధాన్యాదికమగు సమస్తసంపత్తును పొంది సుఖించును. దరిద్రుఁడు ధనమును పొందును. బద్ధుఁడైనవాఁడు ముక్తుఁ డగును. భయగ్రస్తుఁడు ధైర్యవంతుఁ డగును.

ఈప్సితం చ ఫలం భుక్త్వా చాంతే సత్యపురం యయౌ,
ఇతి వః కథితం విప్రా స్సత్యనారాయణవ్రతం.
యత్కృత్వా సర్వదుఃఖేభ్యో ముక్తో భవతి మానవః,

తా. కోరిన కోరికలన్నియుఁగూడ పొంది అంతమున సత్యపురమున కరిగి సుఖించును. ఇట్లు మీకు సత్యనారాయణవ్రతము చేయవలసిన యావశ్యకమును, విధానమును, మాహాత్మ్యమును, ఫలమును చెప్పితిని.

విశేషతః కలియుగే సత్యపూజా ఫలప్రదా,
కేచిత్కాలా వదిష్యంతి సత్యమీశం తమేవ చ,

సత్యనారాయణం కేచిత్సత్యదేవం తథైవచ.

తా. ఈ కలియుగమున ఈ సత్యనారాయణవ్రతమే విశేష ఫల ప్రదమైనది. కలియుగమున కొందరు స్వామిని సత్యేశ్వరుఁడని, కొందరు సత్యనారాయణుఁడని, కొందరు సత్యదేవుఁడని పిలిచెదరు.

నానారూపధరో భూత్వా సర్వేషా మీప్సితప్రదః,
భవిష్యతి కలౌ సత్యవ్రతరూపే సనాతనః.

తా. సనాతనుఁడగు శ్రీసత్యనారాయణమూర్తి కలియుగమున అనేక రూపములు పొంది భక్తులకందరికిని కోరిక లొనఁగూర్చుచుండును.

కథాం వా శృణుయాద్యస్తు పశ్యేద్వా వ్రతముత్తమం,
తస్య నశ్యంతి పాపాని సత్యదేవప్రసాదతః.

తా. వ్రతను చేయకున్నను ఎవరైన చేయుచున్నవ్రతమును చూచి నను, చివరకు కథనువిన్నను స్వామి యనుగ్రహామువలన సకలపాపమును తొలఁగిపోవును.

ఇతి శ్రీస్కాందే రేవాఖండే సత్యనారాయణవ్రతకథాయాం
పంచమోఽధ్యాయ స్సమాప్తః.

---

పునఃపూజా:—పునః ప్రాణానాయమ్య...శ్రీసత్యనారాయణముద్దిశ్య శ్రీసత్యనారాయణస్వామిప్రీత్యర్థం శ్రీసత్యనారాయణస్వామినః పునఃపూజాం కరిష్యే, శ్రీ సత్యనారాయణ స్వామినే నమః ధ్యాయామి, ఆవాహయామి, రత్నసింహాసనం సమర్పయామి, పాదయోః పాద్యం సమర్పయామి, హస్తయో రర్ఘ్యం సమర్పయామి, స్నపయామి, శుద్ధాచమ

నీయం సమర్పయామి, వస్త్రయుగ్మం సమర్పయామి, యజ్ఞోపవీతం సమర్పయామి, దివ్యశ్రీచందనం సమర్పయామి, అక్షతాం సమర్పయామి, నానావిధపుష్పాణి పూజయామి. ఓం కేశవాయ నమః, ... ధూప మాఘ్రాపయామి, దీపందర్శయామి, ధూపదీపానంతరమాచమనీయం సమర్పయామి.

నైవేద్యం.—ఓం భూర్భువస్సువః ప్రచోదయాత్, సత్యంత్వర్తేన పరిషించామి, శ్రీ సత్యనారాయణస్వామినే అమృతమస్తు. అమృతోపస్తరణమసి,ఓం ప్రాణాయ స్వాహా... సమానాయ స్వాహా, మధ్యేమధ్యేపానీయం సమర్పయామి, అమృతాపిధానమసి ఉత్తరాపోశనం సమర్పయామి, తాంబూలం సమర్పయామి, సువర్ణమంత్రపుష్పం సమర్పయామి, ప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి, అనయా ధ్యానఆవాహనాదిషోడశోపచారపూజయా భగవాన్ సర్వాత్మకః శ్రీ సత్యనారాయణస్వామీసుప్రీత స్సుప్రసన్నో వరదోభవతు. శ్రీసత్యనారాయణప్రసాదం శిరసాగృహ్ణామి.

ఉద్వాసనం.—యజ్ఞేన యజ్ఞమయజంతదేవాః, తాని ధర్మాణి ప్రథమాన్యాసన్, తేహనాకం మహిమానస్సచంతే యత్రపూర్వేసాధ్యాస్సంతి దేవాః.

మంటపదానం —పునః ప్రాణానాయమ్య...పరమేశ్వర ప్రీత్యర్థం స్వర్ణస్వర్చిత ప్రతిమామంటపదానం కరిష్యే. శ్రీ

సత్యనారాయణస్వరూపస్య బ్రాహ్మణస్య ఉభాభ్యాంపాద్యం. నమో<sup></sup>స్త్వనంతాయసహస్రమూర్తయే సహస్రపాదాక్షిశిరోరుబాహవే, సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటీ యుగధారిణే నమః. శ్రీ సత్యనారాయణస్వరూపస్య బ్రాహ్మణస్య గంధం, అక్షతాః, పుష్పాణి. అస్మైబ్రాహ్మణాయ యజుశ్శాఖాధ్యాయినే ... గోత్రాయ ... శర్మణే ప్రతిగ్రహీత్రే శ్రీమార్గగోత్రః...నామధేయః ధర్మపత్నీసమేతో<sup></sup>హం గోత్రస్య నామధేయస్య ధర్మపత్నీసమేతస్య మమోపాత్తదురితక్షయద్వారా శ్రీ పరమేశ్వరప్రీత్యర్థం సత్యనారాయణ స్వర్ణస్వర్చిత ప్రతిమామంటపం తుభ్యమహం సంప్రదేనమమ. దేవస్యత్వా సవితుః ప్రసవే<sup></sup>శ్వినోర్బాహుభ్యాంపూష్ణోహస్తాభ్యాం ప్రతిగృహ్ణామి. వక్ష్యే(?)యనే ప్రతిగృహ్ణామి. ఏతద్దాన సాద్గుణ్యార్థం యథాశక్తి దక్షిణాం తుభ్యమహం సంప్రదదేనమమ.

శ్రీ సత్యనారాయణవ్రతకల్పము సమాప్తము.

---

# శ్రీ విష్ణుసహస్రనామావళిః



ఓం విశ్వస్మై (విశ్వాయ) నమః
విష్ణవే
వషట్కారాయ
భూతభవ్యభవత్ప్రభవే
భూతకృతే
భూతభృతే
భావాయ
భూతాత్మనే
భూతభావనాయ
పూతాత్మనే ౧౦
పరమాత్మనే
ముక్తానాం పరమాగతయే
అవ్యయాయ
పురుషాయ
సాక్షిణే
క్షేత్రజ్ఞాయ
అక్షరాయ
యోగాయ
యోగవిదాం నేత్రే
ప్రధానపురుషేశ్వరాయ ౨౦

ఓం నారసింహవపుషే
శ్రీమతే
కేశవాయ
పురుషోత్తమాయ
సర్వస్మై (సర్వాయ)
శర్వాయ
శివాయ
స్థాణవే
భూతాదయే
నిధయే అవ్యయాయ
సంభవాయ
భావనాయ
భర్త్రే
ప్రభవాయ
ప్రభవే
ఈశ్వరాయ
స్వయమ్భువే
శమ్భవే
ఆదిత్యాయ
పుష్కరాక్షాయ
మహాస్వనాయ
అనాదినిధనాయ
ధాత్రే
విధాత్రే

ఓం ధాతురుత్తమాయన
అప్రమేయాయ
హృషీకేశాయ
పద్మనాభాయ
అమరప్రభవే
విశ్వకర్మణే ౫౦
మనవే
త్వష్ట్రే
స్థవిష్ఠాయ
స్థవిరాయ ధ్రువాయ
అగ్రాహ్యాయ
శాశ్వతాయ
కృష్ణాయ
లోహితాక్షాయ
ప్రతర్దనాయ
ప్రభూతాయ ౬౦
త్రికకుద్ధా(బ్ధా)మ్నే
పవిత్రాయ
పరస్మై మంగళాయ
ఈశానాయ
ప్రాణదాయ
ప్రాణాయ
జ్యేష్ఠాయ
శ్రేష్ఠాయ

ఓం ప్రజాపతయే నమః
హిరణ్యగర్భాయ
భూగర్భాయ
మాధవాయ
మధుసూదనాయ
ఈశ్వరాయ
విక్రమిణే
ధన్వినే
మేధావినే
విక్రమాయ
క్రమాయ
అనుత్తమాయ ౭౦
దురాధర్షాయ
కృతజ్ఞాయ
కృతయే
ఆత్మవతే
సురేశాయ
శరణాయ
శర్మణే
విశ్వరేతసే
ప్రజాభవాయ
అహ్నే ౮౦
సంవత్సరాయ
వ్యాళాయ
ప్రత్యయాయ
సర్వదర్శనాయ
అజాయ
సర్వేశ్వరాయ

ఓం సిద్ధాయ నమః
సిద్ధయే
సర్వాదయే
అచ్యుతాయ ౧౦౦
వృషాకపయే
అమేయాత్మనే
సర్వయోగ వినిస్సృతాయ
వసవే
వసుమనసే
సత్యాయ
సమాత్మనే
అసమ్మితాయ
సమాయ
అమోఘాయ ౧౧౦
పుణ్డరీకాక్షాయ
వృషకర్మణే
వృషాకృతయే
రుద్రాయ
బహుశిరసే
బభ్రవే
విశ్వయోనయే
శుచిశ్రవసే
అమృతాయ
శాశ్వతస్థాణవే
వరారోహాయ
మహాతపసే
సర్వగాయ

ఓం సర్వవిద్భానవేనమః
విష్వక్సేనాయ
జనార్దనాయ
వేదాయ
వేదవిదే
అవ్యఙ్గాయ
వేదాఙ్గాయ ౧౩౦
వేదవిదే
కవయే
లోకాధ్యక్షాయ
సురాధ్యక్షాయ
ధర్మాధ్యక్షాయ
కృతాకృతాయ
చతురాత్మనే
చతుర్వ్యూహాయ
చతుర్దంష్ట్రాయ
చతుర్భుజాయ
భ్రాజిష్ణవే
భోజనాయ
భోక్త్రే
సహిష్ణవే
జగదాదిజాయ
అనఘాయ
విజయాయ
జేత్రే నమః
విశ్వయోనయే
పునర్వసవే ౧౪౦
ఉపేన్ద్రాయ

ఓం వామనాయ నమః
ప్రాంశవే
అమోఘాయ
శుచయే
ఊర్జితాయ
అతీన్ద్రాయ
సంగ్రహాయ
సర్గాయ
ధృతాత్మనే ౧౬౦
నియమాయ
యమాయ
వేద్యాయ
వైద్యాయ
సదాయోగినే
వీరఘ్నే
మాధవాయ
మధవే
అతీన్ద్రియాయ
మహామాయాయ
మహోత్సాహాయ
మహాబలాయ
మహాబుద్ధయే
మహావీర్యాయ
మహాశక్తయే
మహాద్యుతయే
అనిర్దేశ్యవపుషే
శ్రీమతే
అమేయాత్మనే

ఓం మహాద్రిధృతే ౧౭౦
మహేష్వాసాయ
మహీభర్త్రే
శ్రీనివాసాయ
సతాంగతయే
అనిరుద్ధాయ
సురానన్దాయ
గోవిన్దాయ
గోవిదాంపతయే
మరీచయే
దమనాయ ౧౮౦
హంసాయ
సుపర్ణాయ
భుజగోత్తమాయ
హిరణ్యనాభాయ
సుతపసే
పద్మనాభాయ
ప్రజాపతయే
అమృత్యవే
సర్వదృశే
సింహాయ ౧౯౦
సన్ధాత్రే నమః
సన్ధిమతే
స్థిరాయ
అజాయ
దుర్మర్షణాయ
శాస్త్రే
విశ్రుతాత్మనే

ఓం సురారిఘ్నే నమః
గురవే
గురుతమాయ ౨౦౦
ధామ్నే
సత్యాయ
సత్యపరాక్రమాయ
నిమిషాయ
అనిమిషాయ
స్రగ్విణే
వాచస్పతయే ఉదారధియే
అగ్రణ్యే
గ్రామణ్యే
శ్రీమతే ౨౧౦
న్యాయాయ
నేత్రే
సమీరణాయ
సహస్రమూర్ధ్నే
విశ్వాత్మనే
సహస్రాక్షాయ
సహస్రపదే
ఆవర్తనాయ
నివృత్తాత్మనే
సంవృతాయ ౨౨౦
సంప్రమర్దనాయ
అహస్సంవర్తకాయ
వహ్నయే
అనిలాయ

ఓం ధరణీధరాయ నమః
సుప్రసాదాయ
ప్రసన్నాత్మనే
విశ్వసృజే
విశ్వభుజే
విభవే ౨౪౦
సత్కర్త్రే
సత్కృతాయ
సాధవే
జహ్నవే
నారాయణాయ
నరాయ
అసంఖ్యేయాయ
అప్రమేయాత్మనే
విశిష్టాయ
శిష్టకృతే ౨౫౦
శుచయే
సిద్ధార్థాయ
సిద్ధసఙ్కల్పాయ
సిద్ధిదాయ
సిద్ధిసాధనాయ
వృషాహిణే
వృషభాయ
విష్ణవే
వృషపర్వణే
వృషోదరాయ
వర్ధనాయ

ఓం వర్ధమానాయ నమః
వివిక్తాయ
శ్రుతిసాగరాయ
సుభుజాయ
దుర్ధరాయ
వాగ్మినే
మహేంద్రాయ
వసుదాయ
వసవే ౨౭౦
నైకరూపాయ
బృహద్రూపాయ
శిపివిష్టాయ
ప్రకాశనాయ
ఓజస్తేజోద్యుతిధరాయ
ప్రకాశాత్మనే
ప్రతాపనాయ
బుద్ధాయ
స్పష్టాక్షరాయ
మన్త్రాయ ౨౮౦
చన్ద్రాంశవే
భాస్కరద్యుతయే
అమృతాంశూద్భవాయ
భానవే
శశిబిన్దవే
సురేశ్వరాయ
ఔషధాయ

ఓం జగతస్సేతవే నమః
సత్యధర్మపరాక్రమాయ
భూతభవ్యభవన్నాథాయ
పవనాయ
పావనాయ
అనలాయ
కామఘ్నే
కామకృతే
కాన్తాయ
కామాయ
కామప్రదాయ
ప్రభవే
యుగాదికృతే ౩౦౦
యుగావర్తాయ
నైకమాయాయ
మహాశనాయ
అదృశ్యాయ
వ్యక్తరూపాయ
సహస్రజితే
అనన్తజితే
ఇష్టాయ
విశిష్టాయ
శిష్టేష్టాయ ౩౧౦
శిఖణ్డినే
నహుషాయ
వృషాయ

ఓం క్రోధఘ్నే నమః
క్రోధకృత్కర్త్రే
విశ్వబాహవే
మహీధరాయ
అచ్యుతాయ
ప్రథితాయ
ప్రాణాయ ౩౧౦
ప్రాణదాయ
వాసవానుజాయ
అపాంనిధయే
అధిష్ఠానాయ
అప్రమత్తాయ
ప్రతిష్ఠితాయ
స్కన్దాయ
స్కన్దధరాయ
ధుర్యాయ
వరదాయ ౩౨౦
వాయువాహనాయ
వాసుదేవాయ
బృహద్భానవే
ఆదిదేవాయ
పురన్దరాయ
అశోకాయ
తారణాయ
తారాయ
శూరాయ
శౌరయే ౩౩౦
జనేశ్వరాయ

ఓం అనుకూలాయ నమః
శతావర్తాయ
పద్మినే
పద్మనిభేక్షణాయ
పద్మనాభాయ
అరవిన్దాక్షాయ
పద్మగర్భాయ
శరీరభృతే
మహర్ధయే ౩౪౦
ఋద్ధాయ
వృద్ధాత్మనే
మహాక్షాయ
గరుడధ్వజాయ
అతులాయ
శరభాయ
భీమాయ
సమయజ్ఞాయ
హవిర్హరయే
సర్వలక్షణలక్షణ్యాయ
లక్ష్మీవతే
సమితింజయాయ
విక్షరాయ
రోహితాయ
మార్గాయ
హేతవే
దామోదరాయ
సహాయ
మహీధరాయ

ఓం మహాభాగాయ నమః
వేగవతే
అమితాశనాయ
ఉద్భవాయ
క్షోభణాయ
దేవాయ
శ్రీగర్భాయ
పరమేశ్వరాయ
కరణాయ
కారణాయ
కర్త్రే ౩౭౦
వికర్త్రే
గహనాయ
గుహాయ
వ్యవసాయాయ
వ్యవస్థానాయ
సంస్థానాయ
స్థానదాయ
ధ్రువాయ
పరర్ధయే
పరమస్పష్టాయ
తుష్టాయ
పుష్టాయ
శుభేక్షణాయ
రామాయ
విరామాయ
విరజాయ
మార్గాయ

ఓం నేయాయ నమః
నయాయ
అనయాయ ౪౦౦
వీరాయ
శక్తిమతాం శ్రేష్ఠాయ
ధర్మాయ
ధర్మవిదుత్తమాయ
వైకుంఠాయ
పురుషాయ
ప్రాణాయ
ప్రాణదాయ
ప్రణ(ణా)మాయ
పృథవే ౪౧౦
హిరణ్యగర్భాయ
శత్రుఘ్నాయ
వ్యాప్తాయ
వాయవే
అధోక్షజాయ
ఋతవే
సుదర్శనాయ
కాలాయ
పరమేష్ఠినే
పరిగ్రహాయ
ఉగ్రాయ
సంవత్సరాయ
దక్షాయ
విశ్రామాయ
విశ్వదక్షిణాయ

ఓం విస్తారాయ నమః
స్థావరాయస్థాణవే
ప్రమాణాయ
బీజాయఅవ్యయాయ
అర్థాయ ౪౩౦
అనర్థాయ
మహాకోశాయ
మహాభోగాయ
మహాధనాయ
అనిర్విణ్ణాయ
స్థవిష్ఠాయ
అభవే
ధర్మయూపాయ
మహామఖాయ
నక్షత్రనేమయే
నక్షత్రిణే
క్షమాయ
క్షామాయ
సమీహనాయ
యజ్ఞాయ
ఇజ్యాయ
మహేజ్యాయ
క్రతవే
సత్రాయ
సతాంగతయే
సర్వదర్శినే
విముక్తాత్మనే
సర్వజ్ఞాయ

ఓం జ్ఞానాయోత్తమాయ
సువ్రతాయ నమః
సుముఖాయ
సూక్ష్మాయ
సుఘోషాయ
సుఖదాయ
సుహృదే
మనోహరాయ
జితక్రోధాయ
వీరబాహవే
విదారణాయ
స్వాపనాయ
స్వవశాయ
వ్యాపినే
నైకాత్మనే
నైకకర్మకృతే
వత్సరాయ ౪౭౦
వత్సలాయ
వత్సినే
రత్నగర్భాయ
ధనేశ్వరాయ
ధర్మకృతే
ధర్మగుప్తే
ధర్మిణే
సతే
అసతే
క్షరాయ ౪౮౦
అక్షరాయ

ఓం అవిజ్ఞాత్రే నమః
సహస్రాంశవే
విధాత్రే
కృతలక్షణాయ
గభస్తినేమయే
సత్త్వస్థాయ
సింహాయ
భూతమహేశ్వ
రాయ
ఆదిదేవాయ ౪౯౦
మహాదేవాయ
దేవేశాయ
దేవభృద్గురవే
ఉత్తరాయ
గోపతయే
గోప్త్రే
జ్ఞానగమ్యాయ
పురాతనాయ
శరీరభూతభృతే
భోక్త్రే ౫౦౦
కపీన్ద్రాయ
భూరిదక్షిణాయ
సోమపాయ
అమృతపాయ
సోమాయ
పురుజితే
పురుసత్తమాయ
నయాయ

ఓం జయాయ నమః
సత్యసన్ధాయ ౫౧౦
దాశార్హాయ
సాత్వతాంపతయే
జీవాయ
వినయితాసాక్షిణే
ముకున్దాయ
అమితవిక్రమాయ
అమ్భోనిధయే
అనన్తాత్మనే
మహోదధిశయాయ
అన్తకాయ ౫౨౦
అజాయ
మహార్హాయ
స్వాభావ్యాయ
జితామిత్రాయ
ప్రమోదనాయ
ఆనన్దాయ
నన్దనాయ
ఆనన్దాయ
సత్యధర్మిణే
త్రివిక్రమాయ
మహర్షయే కపిలా
చార్యాయ
కృతజ్ఞాయ
మేదినీపతయే
త్రిపదాయ
త్రిదశాధ్యక్షాయ

ఓం మహాశృంగాయ నమః
కృతాన్తకృతే
మహావరాహాయ
గోవిన్దాయ
సుషేణాయ ౫౪౦
కనకాఙ్గదినే
గుహ్యాయ
గభీరాయ
గహనాయ
గుప్తాయ
చక్రగదాధరాయ
వేధసే
స్వాంగాయ
అజితాయ
కృష్ణాయ
దృఢాయ
సఙ్కర్షణాయ
అచ్యుతాయ
వరుణాయ
వారుణాయ
వృక్షాయ
పుష్కరాక్షాయ
మహామనసే
భగవతే
భగఘ్నే
ఆనన్దినే ౫౬౦
వనమాలినే
హలాయుధాయ

ఓం ఆదిత్యాయ నమః
జ్యోతిరాదిత్యాయ
సహిష్ణవే
గతిసత్తమాయ
సుధన్వనే
ఖణ్డపరశవే
దారుణాయ
ద్రవిణప్రదాయ
దివిస్పృశే
సర్వదృశే వ్యాసాయ
వాచస్పతయే అయోనిజాయ
త్రిసామ్నే
సామగాయ
సామ్నే
నిర్వాణాయ
భేషజాయ
భిషజే
సన్న్యాసకృతే
శమాయ
శాన్తాయ
నిష్ఠాయై
శాన్తయే
పరాయణాయ
శుభాంగాయ
శాన్తిదాయ
స్రష్ట్రే
కుముదాయ

ఓం కువలేశయాయ నమః
గోహితాయ
గోపతయే
గోప్త్రే
వృషభాక్షాయ
వృషప్రియాయ
అనివర్తినే
నివృత్తాత్మనే
సంక్షేప్త్రే
క్షేమకృతే
శివాయ ౬౦౦
శ్రీవత్సవక్షసే
శ్రీవాసాయ
శ్రీపతయే
శ్రీమతాంవరాయ
శ్రీదాయ
శ్రీశాయ
శ్రీనివాసాయ
శ్రీనిధయే
శ్రీవిభావనాయ
శ్రీధరాయ ౬౧౦
శ్రీకరాయ
శ్రేయసే
శ్రీమతే
లోకత్రయాశ్రయాయ
స్వక్షాయ
స్వంగాయ

ఓం శతానన్దాయ నమః
నన్దయే
జ్యోతిర్గణేశ్వరాయ
విజితాత్మనే ౬౨౦
విధేయాత్మనే
సత్కీర్తయే
ఛిన్నసంశయాయ
ఉదీర్ణాయ
సర్వతశ్చక్షుషే
అనీశాయ
శాశ్వతస్థిరాయ
భూశయాయ
భూషణాయ
భూతయే ౬౩౦
విశోకాయ
శోకనాశనాయ
అర్చిష్మతే
అర్చితాయ
కుమ్భాయ
విశుద్ధాత్మనే
విశోధనాయ
అనిరుద్ధాయ
అప్రతిరథాయ
ప్రద్యుమ్నాయ
అమితవిక్రమాయ
కాలనేమినిఘ్నే
వీరాయ
శౌరయే

ఓం శూరజనేశ్వరాయ
త్రిలోకాత్మనే
త్రిలోకేశాయ
కేశవాయ
కేశిఘ్నే
హరయే ౬౫౦
కామదేవాయ
కామపాలాయ
కామినే
కాన్తాయ
కృతాగమాయ
అనిర్దేశ్యవపుషే
విష్ణవే
వీరాయ
అనన్తాయ
ధనంజయాయ ౬౬౦
బ్రహ్మణ్యాయ
బ్రహ్మకృతే
బ్రహ్మణే
బ్రహ్మణే
బ్రహ్మవివర్ధనాయ
బ్రహ్మవిదే
బ్రాహ్మణాయ
బ్రహ్మిణే
బ్రహ్మజ్ఞాయ
బ్రాహ్మణప్రియాయ ౬౭౦
మహాక్రమాయ

ఓం మహాకర్మణే నమః
మహాతేజసే
మహోరగాయ
మహాక్రతవే
మహాయజ్వనే
మహాయజ్ఞాయ
మహాహవిషే
స్తవ్యాయ
స్తవప్రియాయ
స్తోత్రాయ
స్తుతయే
స్తోత్రే
రణప్రియాయ
పూర్ణాయ
పూరయిత్రే
పుణ్యాయ
పుణ్యకీర్తయే
అనామయాయ
మనోజవాయ ౬౮౦
తీర్థకరాయ
వసురేతసే
వసుప్రదాయ
వసుప్రదాయ
వాసుదేవాయ
వసవే
వసుమనసే
హవిషే
సద్గతయే

ఓం సత్కృతయే నమః
సత్తాయై
సద్భూతయే
సత్పరాయణాయ
శూరసేనాయ
యదుశ్రేష్ఠాయ
సన్నివాసాయ
సుయామునాయ
భూతావాసాయ
వాసుదేవాయ
సర్వాసునిలయాయ
అనలాయ
దర్పఘ్నే
దర్పదాయ
దృప్తాయ
దుర్ధరాయ
అపరాజితాయ
విశ్వమూర్తయే
మహామూర్తయే
దీప్తమూర్తయే
అమూర్తిమతే ౭౦౦
అనేకమూర్తయే
అవ్యక్తాయ
శతమూర్తయే
శతాననాయ
ఏకస్మై (ఏకాయ)
నైకస్మై (నైకాయ)
సవాయ

ఓం కాయ నమః
కస్మై (కిమే)
యస్మై (యతే)
తస్మై (తతే)
పదాయానుత్తమా
య
లోకబన్ధవే
లోకనాథాయ
మాధవాయ
భక్తవత్సలాయ
సువర్ణవర్ణాయ
హేమాంగాయ
వరాంగాయ
చన్దనాఙ్గదినే ౭౪౦
వీరఘ్నే
విషమాయ
శూన్యాయ
ఘృతాశిషే
అచలాయ
చలాయ
అమానినే
మానదాయ
మాన్యాయ
లోకస్వామినే ౭౫౦
త్రిలోకధృతే
సుమేధసే
మేధజాయ
ధన్యాయ

ఓం సత్యమేధసే నమః
ధరాధరాయ
తేజోవృషాయ
ద్యుతిధరాయ
సర్వశస్త్రభృతాంవ
రాయ
ప్రగ్రహాయ ౭౬౦
నిగ్రహాయ
వ్యగ్రాయ
నైకశృంగాయ
గదాగ్రజాయ
చతుర్మూర్తయే
చతుర్బాహవే
చతుర్వ్యూహాయ
చతుర్గతయే
చతురాత్మనే
చతుర్భావాయ
చతుర్వేదవిదే
ఏకపాదే
సమావర్తాయ
అనివృత్తాత్మనే
దుర్జయాయ
దురతిక్రమాయ
దుర్లభాయ
దుర్గమాయ
దుర్గాయ
దురావాసాయ
దురారిఘ్నే

ఓం శుభాంగాయ నమః
లోకసారంగాయ
సుతన్తవే
తన్తువర్ధనాయ
ఇన్ద్రకర్మణే
మహాకర్మణే
కృతకర్మణే
కృతాగమాయ
ఉద్భవాయ ౭౯౦
సున్దరాయ
సున్దాయ
రత్ననాభాయ
సులోచనాయ
అర్కాయ
వాజసనాయ
శృఙ్గిణే
జయన్తాయ
సర్వవిజ్జయినే
సువర్ణబిన్దవే ౮౦౦
అక్షోభ్యాయ
సర్వవాగీశ్వరేశ్వరా
య
మహాహ్రదాయ
మహాగర్తాయ
మహాభూతాయ
మహానిధయే
కుముదాయ
కున్దరాయ

ఓం కున్దాయ నమః
పర్జన్యాయ ౭౧౦
పావనాయ
అనిలాయ
అమృతాశాయ
అమృతవపుషే
సర్వజ్ఞాయ
సర్వతోముఖాయ
సులభాయ
సువ్రతాయ
సిద్ధాయ
శత్రుజితే ౭౨౦
శత్రుతాపనాయ
న్యగ్రోధాయ
ఉదుంబరాయ
అశ్వత్థాయ
చాణూరాంధ్ర నిషూదనాయ
సహస్రార్చిషే
సప్తజిహ్వాయ
సప్తైధసే
సప్తవాహనాయ
అమూర్తయే ౭౩౦
అనఘాయ
అచిన్త్యాయ
భయకృతే
భయనాశనాయ
అణవే

ఓం బృహతే నమః
కృశాయ
స్థూలాయ
గుణభృతే
నిర్గుణాయ ౭౪౦
మహతే
అధృతాయ
స్వధృతాయ
స్వాస్థ్యాయ
ప్రాగ్వంశాయ
వంశవర్ధనాయ
భారభృతే
కథితాయ
యోగినే
యోగీశాయ ౭౫౦
సర్వకామదాయ
ఆశ్రమాయ
శ్రమణాయ
క్షామాయ
సుపర్ణాయ
వాయువాహనాయ
ధనుర్ధరాయ
ధనుర్వేదాయ
దణ్డాయ
దమయిత్రే ౭౬౦
దమాయ
అపరాజితాయ
సర్వసహాయ

ఓం నియన్త్రే నమః
అనియమాయ
అయమాయ
సత్త్వవతే
సాత్త్వికాయ
సత్యాయ
సత్యధర్మపరాయణా[య
అభిప్రాయాయ
ప్రియార్హాయ
అర్హాయ
ప్రియకృతే
ప్రీతివర్ధనాయ
విహాయసగతయే
జ్యోతిషే
సురుచయే
హుతభుజే
విభవే ౭౭౦
రవయే
విరోచనాయ
సూర్యాయ
సవిత్రే
రవిలోచనాయ
అనన్తాయ
హుతభుజే
భోక్త్రే
సుఖదాయ
నైకజాయ ౭౮౦
అగ్రజాయ

ఓం అనిర్విణ్ణాయ నమః
సదామర్షిణే
లోకాధిష్ఠానాయ
అద్భుతాయ
సనాతే
సనాతనతమాయ
కపిలాయ
కపయే
అవ్యయాయ ౯౦౦
స్వస్తిదాయ
స్వస్తికృతే
స్వస్తినే
స్వస్తిభుజే
స్వస్తిదక్షిణాయ
అరౌద్రాయ
కుణ్డలినే
చక్రిణే
విక్రమిణే
ఊర్జితశాసనాయ
శబ్దాతిగాయ
శబ్దసహాయ
శిశిరాయ
శర్వరీకరాయ
అక్రూరాయ
పేశలాయ
దక్షాయ
దక్షిణాయ
క్షమిణాంవరాయ

ఓం విద్వత్తమాయ నమః
వీతభయాయ
పుణ్యశ్రవణకీర్తనాయ
ఉత్తారణాయ
దుష్కృతిఘ్నే
పుణ్యాయ
దుస్స్వప్ననాశనాయ
వీరఘ్నే
రక్షణాయ
సన్తాయ
జీవనాయ ౯౩౦
పర్యవస్థితాయ
అనన్తరూపాయ
అనన్తశ్రియే
జితమన్యవే
భయాపహాయ
చతురశ్రాయ
గభీరాత్మనే
విదిశాయ
వ్యాదిశాయ
దిశాయ ౯౪౦
అనాదయే
భూర్భువాయ
లక్ష్మ్యై
సువీరాయ
రుచిరాఙ్గదాయ

ఓం జననాయ నమః
జనజన్మాదయే
భీమాయ
భీమపరాక్రమాయ
ఆధారనిలయాయ
ధాత్రే
పుష్పహాసాయ
ప్రజాగరాయ
ఊర్ధ్వగాయ
సత్పథాచారాయ
ప్రాణదాయ
ప్రణవాయ
పణాయ
ప్రమాణాయ
ప్రాణనిలయాయ
ప్రాణభృతే
ప్రాణజీవనాయ
తత్త్వాయ
తత్త్వవిదే
ఏకాత్మనే
జన్మమృత్యుజరాతిగాయ
భూర్భువస్స్వస్తరవే
తారాయ
సవిత్రే
ప్రపితామహాయ
యజ్ఞాయ
యజ్ఞపతయే
యజ్వనే

ఓం యజ్ఞాఙ్గాయ నమః
యజ్ఞవాహనాయ
యజ్ఞభృతే
యజ్ఞకృతే
యజ్ఞినే
యజ్ఞభుజే
యజ్ఞసాధనాయ
యజ్ఞాన్తకృతే
యజ్ఞగుహ్యాయ
అన్నాయ

ఓం అన్నాదాయ నమః
ఆత్మయోనయే
స్వయంజాతాయ
వైఖానాయ
సామగాయనాయ
దేవకీనందనాయ
స్రష్ట్రే ౯౯౦
క్షితీశాయ
పాపనాశనాయ
శఙ్ఖభృతే

ఓం నన్దకినే నమః
చక్రిణే
శార్ఙ్గధన్వనే
గదాధరాయ
రథాఙ్గపాణయే
అక్షోభ్యాయ
సర్వప్రహరణాయుధాయ నమః
౧౦౦౦

శ్రీ విష్ణుసహస్రనామావళిః
సమాప్తమ్.



చెన్నపురి: శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము:—1931.

# వైదికగ్రంథములు.



| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అమావాస్యాతర్పణము | ... | 0 | 1 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆపస్తంబప్రవరకాండ | ... | 0 | 3 |
| ఆశ్వలాయనప్రవరకాండ | ... | 0 | 2 |
| ఆబ్ధికమన్త్రములు (యజుర్వేదము) మూలము | ... | 0 | 6 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 2 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, మేలుప్రతి | ... | 0 | 2 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము, మేలుప్రతి | ... | 2 | 0 |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, ఆశ్వలాయనము, చిన్నసైజు | ... | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 2 |
| తిథిమంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 | 2 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 1 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, బ్రహ్మమేధసహితము | ... | 0 | 4 |
| డిటో టీకాతాత్పర్యము | ... | 3 | 0 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| పంచసూక్తములు, సస్వరము | ... | 0 | 2 |
| పితృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 1 |
| బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 2 |
| మహాన్యాసము, చిన్నసైజు | ... | 0 | 6 |
| మంత్రప్రశ్నము | ... | 0 | 3 |
| ,, సస్వరము | ... | 0 | 6 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 1 |
| యజుస్సప్తలక్షణము | ... | 0 | 2 |
| యజ్ఞోపవీతధారణవిధి | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 8 |

యజుర్వేదసంధ్యావందనము, మూలము, సస్వరము ... 0

,, పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము 0

మా[illegible]పూర్వప్రయోగచంద్రిక, సస్వరము—అనేకవిషయములం జేర్చి మహాంధ్రమహాజన సంప్రదాయానుసారముగఁ బరిష్కరించి ముద్రించియున్నాము, మేలుప్రతి ... 2

రుద్రము, నమకము, చమకము, సస్వరము, చిన్నసైజు ... 0

శ్రీవైష్ణవాహ్నికము ... 0

శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ... 0

వ్రతచూడామణి, 360 వ్రతములు చక్కఁగ ముద్రితము ... 2

వ్రతరత్నాకరము, ప్రథమభాగము—ఇందు వ్రతసంకల్పము మొదలు పూజముగియువఱకు చేయవలసిన విధులఁ దెల్పి ప్రాణప్రతిష్ఠ, కలశపూజ, గణాధిపతిపూజ, షోడశోపచార శ్లోకములు మొదలగువానిని తాత్పర్యముతోడ ముద్రించినారము. ఇందు వినాయకవ్రతము, వరలక్ష్మీవ్రతము, సరస్వతీవ్రతము, అనంతవ్రతము, కేదారేశ్వరవ్రతము, గరుడపంచమీవ్రతము అను 6 వ్రతములు గలవు ... 0

వ్రతరత్నాకరము, ద్వితీయభాగము—ఇందు ఋషిపంచమీ, మధనద్వాదశీ, అమావాస్యాసోమవతీ, కృష్ణాష్టమీ, శ్రీరామనవమీ, అముక్తాభరణసప్తమీ, భక్తేశ్వర, శతవర్తి, లక్షవర్తి, త్రికార్తి, చిత్రగుప్త, క్షీరాబ్ధిశయన, సావిత్రీ, గౌరీ, సంపద్గౌరీ, సత్యనారాయణ, రథసప్తమీ, సంకటచతుర్థీ, ఏకాదశీగురువారము, శ్రవణద్వాదశీ, శరన్నవరాత్రి, నృసింహజయంతీ మున్నగు వ్రతములు గలవు. 1

సూర్యనమస్కారము, చిన్నసైజు ... 0

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.